# తొలినుడి

పాఠక మహాశయులారా!

నా యీ గ్రంథరచనకు మూలము శ్రీమదాంధ్ర భారతము. నా మిత్రులు కొందఱు ప్రోత్సహింప నేనీ నవ్య కవిత్వమునకుఁ గడంగితిని. గ్రంథమును బూర్తికావించినదే తడవుగ నాపైఁ బ్రేమగల 1 శ్రీ వారణాసి వేంకటేశ్వర శాస్త్రి (మధురకవి) 2 వేదాంతం రామకృష్ణమాచార్యులు (సాహిత్య విద్యాప్రవీణ) గార్లు ముద్రణభారమును వహించి నిర్వహించిరి. మఱియుఁ గొందఱు సలహాలనిచ్చిరి; వారందఱకు నా మనఃపూర్వక నమోవాకములు; కాని రచనాప్రమాదములు, ముద్రణాప్రమాదము లనేకములుండవచ్చును. వానిని సహృదయముతోఁ దెల్పినఁ బునర్ముద్రణమునఁ దప్పక సవరించుకొనఁ గలను.

యీ కృషి పాఠకలోకమున కానందమొసఁగిననాఁడు నేను గృతజ్ఞుఁడనని మనవిఁజేసుకొనుచున్నాను.

హైస్కూలు,
నరసరావుపేట.

ఇట్లు విధేయుఁడు.
ర చ యి త,

# ఇతివృత్తము

పూర్వము భరతవంశ సంభవుఁడగు 'శర్యాతి' యను రాజొక్కఁడు గలఁడు; అతనికి నాలుగువేలమంది రాణు లుండిరి. ఎవరియందు నాతనికి సంతానము గలుగదయ్యెను; కాని రూపవతియైన నొక్క యాఁడుపడుచు కొంతకాలమునకుద్భవించె; ఆమె 'సుకన్య' నా సార్థక నామ్నియయ్యెను.

ఒకనాఁ డారాజు తన భార్యలు, కొమరిత, సేనయు వెంటరా నొక భీకరారణ్యమునకు మృగయా విహారమొనర్ప బోయెను. అది దుష్టమృగాకులాటవి యైనను ప్రశాంత మృగప్రచారము గలది. అట్టి శోభనంబగు కావనములోఁ దపమొనర్చు భృగు వంశాగ్రణి యగు 'చ్యవనర్షి' మహిమయై యొప్పినదనఁజెల్లును.

ఆవనములోని వింతలనెల్లఁ దిలకించుచు నారాజానాటి సాయంకాలమున నందున్న 'పయోష్ణి' అను సరోవరముచెంత శిబిరాలలోఁ గాలయాపన మొనర్చెను. మఱునాఁడుదయముననే కొంత పరివారముఁగొని మృగయావిహారము సల్పనేగెను. ఆనాటి సాయంకాలమంతఃపుర జనమొకయెడఁ, గుమారిత సఖురాండ్రతో నొక్కయెడ నాయారామ చోద్యములను గననేగిరి.

బాలికా బృందముతో వనమందాడాడ నా సుకన్య సంచరించి యొక పుట్టను జూచెను. దాని రంధ్రముల బరికింప మెఱుపులా బాలికలకుఁ బొడగట్టెను. వానిని జూచి యా సుకన్య సఖురాండ్రతో మేలమాడుచు రంధ్రముల పుడకలతోనుఁ బొడిచెను. దాన నందున్న మహర్షి నేత్ర కాంతులు మడిసి యంధుడయ్యెను. దాని ఫలితముగ రాజసేనాళికి మలమూత్ర ప్రతి బంధమయ్యెను.

రాజావార్త విని తత్కారణము నరయఁగోరి వెతఁజెందుచుండ నంతఃపుర జనము వలన నావృత్తాంతమును విని యావల్మీకము చెంతకరిగి త్రవ్వించి చూడ నందు భార్గవుఁడగు చ్యవనర్షిని గాంచెను. రాజు పలువిధముల నామునిని ప్రార్థించెను. మహర్షి మహారాజుతో "రాజా నీపుత్రికయగు సుకన్యకను నాకిచ్చి పరిణయమొనరించితివేని నీసేనలోని బాధ నశించు" నన దాని కొడయఁడంగీకరింపక గృహమునకుబోయి సర్వులు విన మహర్షి కోరికను వివరించి చెప్పెను. అందులకాకుమారి హర్షించి యంగీకరించెను.

## 2

పెండ్లిజేయ సమకట్టిన తఱి వధూవరుల గూర్చి బాంధవులు బహువిధములుగఁ దలపోసిరి. కాని వివాహము నిర్విఘ్నముగ సాగెను. రాజున కొదవిన యాపద తొలిగెను.

వధూవరు లల్లారుముద్దుగా నాయరణ్యమునఁ గాపురించుచుండిరి. ఇంతలోఁ జ్యవనుడింటలేని సమయమున నిద్దఱశ్విధులయ్యాశ్రమము జేరి యామె సాధ్వీత్వమును బరీక్షించిరి. ఎన్నివిధములుగ నా స్వర్వైద్యులు లోభపెట్టినను తన సాధ్వీత్వమును రక్షించుకొనుచు నామె సమాధానించెను. ఈసంగతి నంతయు దివ్యదృష్టితో గనియెడి చ్యవనుడాశ్రమమునకు వచ్చి యింతినడిగెను. ఆరామామణి జరిగనదెల్లఁ బూసగ్రుచ్చిన పగిది వినుపించెనుఁ

ఈజరిగిన వృత్తాంతమునకుఁ దానును విచారించి స్వర్వైద్య సరణి నెరిగి 'అదియుఁ దనమేలునకే యగు'ననుకొని దాని యాథార్థమును గమనించి పయోష్ణి స్నానమహిమమున నాముువ్వురును దివ్యరూపముల నందిరి.

సుకన్య తన పాతివ్రత్యకారణముగ నాశ్వినేయులనుండి పతిని వేఱుపఱచుకొని సుఖముగ నుండెను. తత్ప్రత్యుపకారముగఁ జ్యవనర్షి నాకవైద్యులకు యాగములందు సోమ భాగార్హతఁ గలుగజేయ నెంచెను.

## 3

ఒక్కనాడు శర్యాతి తనయల్లుని సురూప సంపదకు సంతసించి కూతునల్లుని గనవెంచి చ్యవనాశ్రమమునకు రాగా అల్లుఁడు శర్యాతిని యాగమొనర్చుటకుఁ బ్రోత్సహించెను.

కొలఁది కాలముననే శర్యాతిచే మఖమొనరింపించుచుశక్రాదులతోఁబాటు అశ్వినులకు సోమభాగమీఁబో నింద్రుఁడు కుపితుండై యాగ దీక్షితుఁడగు తనిపైకి వజ్రాయుధమెత్తెను.

చ్యవనుఁడది గాంచి క్రుద్ధుఁడై యింద్రుని చేతిపాటు జూడ వజ్రపాణి సంస్తంభితుఁడయ్యెను. మహర్షి కోపమునకు మదుఁడను రాక్షసుఁడుద్భవించి శతక్రతువును హతమార్ప సమకట్టెను. దానికి భీతిల్లిన యింద్రుడు చ్యవనుని శరణమనుచు నాశ్వినేయుల సోమ భాగమునకు సమ్మతించెను, వెంటనే మదాసురునకుఁ బ్రత్యేకస్థలము జూపి శక్రాశ్వినమదాసురుల నంపి శర్యాతితో నిష్టాగోష్ఠినుండెను. సుకన్యా చ్యవనులాదర్శప్రాయ దంపతులై చెలంగిరి.

ఓమ్.

# సుకన్య

## ప్రథమ పథకము

శ్రీ కరుణాకరుండు గుణసింధువు భక్తజనావనక్రియా
స్తోకుఁడు వార్ధిజాభిధ సుశోభిత శీలవతీ సుకన్యకో
త్సేకుఁ డరాతి, సంచ్యవనదీక్షితుఁ డర్మిలిఁ బ్రోచుగాత సు
శ్లోకుఁడు సంస్కృతిజ్వాలవిశోషణ దక్షత నెల్లవారలన్!





అది యతిభీక రాటవి; సమంచితదుష్టమృగాలి కాకరం;
బుదిత సమస్త వృక్షనివహోత్కట; మేకపదప్రమేయమై
పొదలుచునుండు; నచ్చరితముం దడవ స్థనధైర్యశాలికే
నొదవెడి విస్మయంబనిన నోపునె ఎల్పుపమింప దానికిన్. ౧

ఆ వనిశోభ నెంచ సముదంచిత ; మవ్వనదేవతా ధృత
ప్రావరణంబొ ; లేక జటి భవ్య మునీశ తపోగ్నికీలయో ;
భావనఁ జేయఁగా భయదవన్యమృగాహత జీవకోటిర
క్తావరణప్రకల్పిత వితానమొ ; కా కది పల్లవాభమో. ౨

నిక్కముఁ జెప్ప నద్ది తరునిర్గతపల్లవపాళిగా దహో
నెక్కొని యా వసంతుఁడు వని న్వసియించి గృహంబుఁ గట్టె నా
కెక్కుడు వారలెందుఁ గలరే ! సరి యుండిన రండిఁకన్నటుల్
చొక్కము లెత్తెనా నెసఁగె ఠీవిగ నవ్వనిఁ బల్లవచ్ఛవిన్. 3

ఋతువుల కెల్ల నగ్రజుఁడు వృద్ధుఁడు మాకిఁక రాజుగా వలె
న్నతఁడె యిఁతెంచు బో లని వసంతునిఁ దోకొని వచ్చి శిష్టులు
ద్ధతిఁ బికశారికాదినినదాలను మంగళహారతు ల్బలే
శ్రుతిసుఖమీయఁ బాడిరనశోభిలె నందు మృగాండజధ్వనుల్. ౪

'వనపతి' యన్న పేరెసఁగ వారిధికే తగునా ? మఱేమి ? యె
వ్వానికిని నుండరాదె ? ధర వాఁ డొకఁడే రతనాలరాశియా ?
యని మన సీసుఁ గుంది తనయందుఁ బ్రవాళము లింద్రనీలము
లొప్పరిచె పద్మశంఖరుచి పుష్పచయంబుల నావనం బహో. ౫

అది యేమో వివరింప దుర్లభ మటఁ వ్యాళంబుల న్నేకపుల్
గదియం ద మ్మలయింపఁ బెట్టు తలతాకట్టైనఁ బ ల్లుట్టుగా;
మది నెంచ న్బరిలేదు సింహాతతి సమ్మానించు నేఱంబుల;
న్బదియేలా? పదరంగ; నచ్చటి మృగవ్యాపారమాశ్చర్యమా. ౬

అట్టి వసంతవేళ మృగయావ్యసనం బెలయింప సొంపు గ
న్పట్ట ససైన్యుఁడై మనుజనాథుఁ డొకం డటఁ గేగుదెంచెఁ; బ
ల్దిట్టగ చుట్ట లాత్మజసతీతతిఁ దోడ్కొని సైన్యపాద సం
ఘట్టన మద్భుతంబుగ నెకాయెకి దైర్యపరీతచేతుఁడై. ౭

రథనేమి ధంధను లధికంబుగా వన
సత్త్వసంతతి యెట్టు సరణి నాగె
మనుజుల యలికిడి విని యల్పమృగములు
కలగుండువడి యెదఁ గాతరించె
మహిళావితతి ఘనమంజీరనినదాల
కచ్చటి మునిచయ మ్మదలుకొనియె
భృత్యాళిహుంకృతు లత్యంత మెగయంగ
శుకపికాలాప మాసొంబగు నీగె

సరస మేర్పడ నాల్గువే ల్సతులతోడ
నంగజాత నిజాంకము నందు నునిచి
ముద్దు లొలికింపఁ బల్కు లమ్ముద్దుబిడ్డ
నృపుఁడు తిలకించె నవ్వన మ్మెల్లకడల. ౮

కాంతారంపుఁ బ్రశాంత భావగతి నేకాయత్త చిత్తంబునన్
సంతోషస్థితి చేకురం దిరుగుచుత్సాహాఢ్యుఁడై ఈఁడు సు
స్వాంతుండై కని యెల్లవారికనెని ట్లారా!వనంబంద మం
దెంతో నందన సుందరస్ఫురణగావించెన్ స్వకచ్ఛోభలన్. ౯

ఘననిష్ఠా పరమాత్మబోధ ముని సంఘావాస సంయుక్తిఁ బా
వనమయ్యెన్, మృగవృక్షపక్షికుల దివ్యజ్జీవనంబయ్యె; నం
దన మయ్యెన్; వనదేవతాతతి సముద్యద్భావ్యసన్క్రీడకుం;
ఘనమయ్యె న్వచమయ్యెఁ నిమ్మగులకున్ ఖ్యాతంబునయ్యెన్సుమీ.

ఆయావింతల నగ్గడించుచు నృపుండాహ్లాద మింపొంద లేఁ
బ్రాయంబొందిన పుత్త్రిఁ గాంతల చమూవ్రాతంబు దన్గూడ నా
ప్యాయంబందుచుఁ బ్రొద్దుగ్రుంకువఱ కాయాసపోటులీక్షింప నా
సాయంకాలమె రా నటంగలుగు కాసారంబు కేగెన్వడిన్. ౧౦

మానసమెంత దీపికన మానసమెంతయు దీటుగొల్ప న
మ్మానననాథుడా కొలని మాటుననే శిబిరాలలోన మం
దానిల సౌరభంబుల కెదంగరమూని సుఖంబుఁజెంది సం
ధానిత నిద్రుఁడయ్యె నిజదారసుతాప్తుల నన్నిశ న్వనిన్.   ౧౨

ఇప్పగిది నృపుడు బహుసుఖ
ముప్పతిలం జేయి గడుపుచుండగ దిశలం
గప్పటి వేకువపొలఁకువ
చొప్పడె వనసీమ ప్రకృతిశోభఁ జెలంగన్.   ౧౩

జలరుహమిత్రుఁడుం గనక సంపదమై నుదయింప నింపు ను
చ్చలితమనంబున న్బ్రకృతి సంభ్రమతన్గరతాళనాదముల్
సలుపుచునున్నటుల్ త్రిపుటి సంగతిగాఁ గృకవాకముల్భువిన్
గలవరపో ధ్వనిన్సలిపె కాకములాకసమందు వేకువన్.   ౧౪

అంతని శాంతికార్యమొడ యండొనరించి పరాక్రమక్రమా
క్రాంత మనస్కుఁడై యనుచరాళినిఁ దోడ్కొని వేటకై వనం
బంతటఁ ద్రిమ్మరించి మృగయాకరణాత్త శరీరతాప వి
శ్రాంతికిఁ జెంతనున్న సరసాంచితమైన 'పయోష్ణి'కిం జనెన్. ౧౫

చనిదేవేరులు నాల్గువేవురుచితాచారంబులన్గొల్వ రా
మనుజాధీశుఁడు చారుపద్మవిలసన్మందానిలవ్రాత సం
జనితానంద సరోవగాహుఁడగు స్వచ్ఛాంభఃక్రీడలేపారఁగాఁ
దనిసెఁ; గాముకులెన్న నూతనపదార్థాకాంక్షితస్వాంతులౌ ౧౭

రాకుమారియుఁ దన సఖురాండ్రఁ గూడి
మేలమాడుచు వనమెల్ల నోలిఁదిరిగి
బహుల సత్పుష్పనికరమ్ముఁ బదిలపఱచి
మధుర ఫలములఁగొన్ని సమ్మతిగ గొనియె. ౧౮

ఆఁడాడందరుఁగూడి, ఘాసముల నైశాహారముల్గూర్చి, పూఁ
బోఁడుల్మేకొని వెంటనంటి తిరుగం బ్రోయాలె దన్గాంక్ష ముం
దాఁడంబోవుచు వింతలన్మృగుల నొయ్యారంబుమైనత్తుఁగాఁ
జూడంబోవనిఁగాంచె నొక్కయెడ నత్యుద్రోరువల్మీకమున్. ౧౯

ఆసమయమ్మునన్సరిగ నాకసమంతట మేఘ పంక్తు లు
ల్లాస మెలర్పఁ గ్రమ్మె; సువిలాస రుచిప్రభ విద్యుదంకురా
భాసముదోఁచె నవ్విపినవాటిక నెల్లెడఁ గన్యకాజన
త్రాసము హెచ్చ వీచె మరుదంకురముల్ ఘనసారభార్ద్రముల్. ౨౦

బాలికలెల్ల నొక్క పరిపాటిగఁ బుట్ట సమీపభూమిఁ దా
మోలలిఁ జేరి 'మేఘము లమోఘముగా వరిషించునేమొ? యీ
వేళ' నటంచుఁ దారు గురువెందని కుంజములందు నుండి వా
తూల దుమారముల్ తొలఁగి పోనటకేగి రొకళ్లొకళ్లుగాన్ ౨౦

కొలది కాలములోననే గురుతరాబ్ద
పంక్తులన్నియు వాతూల పటిమకపుడె
విచ్చిపోయెను బాలికలిచ్చ మెచ్చ;
భానుకిరణాల కిలలో హిమానివోలె. ౨౧

అంతన్బాలిక లంద ఱొక్కమొగిఁ గ్రీడాసక్తలోఁ గల్గి తత్
ప్రాంతస్థోత్కట వామలూరువడి హోరాహోరిగాఁ ద్రొక్కుచున్
సంతోషంబున దాని రంధ్రముల నుత్సాహంబుతోఁ గ్రుచ్చుచు
న్నంతన్దానగ వచ్చె నాకు వివరాలందొలి విద్యుత్ప్రభల్. ౨౨

వల్మీకాగ్రమునుండి విద్యుదుదయంబౌనంచు శాస్త్రమ్ము మున్
బల్మారధ్యయనమ్మొనర్చితిమి తద్భావంబు నేడిందు నీ
వల్మీకమ్మున గాననయ్యెనను చాబాల ల్మహావింతలోఁ
దాల్మిన్వీడుచు సామిధేనులసముద్ధాంతంబులోఁ గ్రుచ్చుచున్. ౨౩

మిణుగురులను గొని యొకచక
ముడుగక భావ్యర్థ నాశముంగన కట్కలే
పొడిచిరి క్రంతల బాలిక;
లడగెగా రుచులాత్మదోషమును భావ్యమునాఁ. ౨౪

ఒకనికొకండు నింపొసగు నొయ్యన నయ్యెడెలాతివారి కిం
చుక శ్రమయైనా ధరిత్రి విధిసూత్ర విచిత్రము గొప్పవారలే
సుకపడనెంతు రన్యులెటు స్రుక్కినఁ జూడరు; లోకమందుఁ బి
ల్లికి చెరలాటమైన పనులే యగు సంకట మెల్కపిల్లకున్. ౨౫

సర్వులవస్థలొందఁ దమ సౌఖ్యమువీడరు జూడరన్యులం
బర్వులు వెట్టుచుందు రనవద్యమవద్యము నాక బుద్ధిలో
గర్వమునంజెలంగుదురు కారుణికత్వమునెన్న సున్న యీ
యుర్వి ధనాఢ్యులారయ నిజోదర పూరణ మాత్రకృత్యులే. ౨౬

తమసౌఖ్యంబెడబాయ రా దొరలు బాధావిద్ధులైన న్నరే;
కమనీయస్థితి మారరా దితరలోకం బే వెతల్ జెందినన్
సుమహత్వంబుఁ దొలంగరాదు పరు లోజోహీనులై మ్రగ్గ నీ
య మిథ్యోన్నత్తత వీడరేమిటికొ అర్థాఢ్యుల్ మహావ్యర్థులై. ౨౭

ఆ విధి బాలికల్ పరమహర్షమునొక్కని మించులంచుఁ దా
మా వివరంబులం గొడుచు చాటలఁ బాటలతోడ నెంతయూ
కావరమెక్క త్రొక్కుచు సుఖంబుగఁ గొంతకునిల్లుసేరి రా
సేవకులు స్నృపుఁడపుడెచేరిరి యింటికి నాటికాదటన్. ౨౮

జేరాలస్వప్నముల్సయింపఁ గలిగెన్ డెందంబులో దుఃఖమూ
ప్రారబ్ధంబదియేమొ? కాని విభుఁడారా కన్నుఁగూర్కింపఁడాఁ
బోరా సాధులకెన్నగల్గ దరియుంబో దుఃఖ మేవారికిం
గోరంబోయెషీ దాని గొడ్డలికిఁ జేకూర్చున్నదా? కర్మముల్. ౨౯

పోయెంబో నిశి తెల్లవారువఱకాభూమీశు సేనాళిలో
మాయా స్ఫురణంబెలర్ప మది నున్మాదంబు సూపట్టగా
నాయాసంబలయింపఁగుంది మలమూత్రాపేతకష్టస్థితిన్
గాయంబందెడఁబాసి పేరిమశరణాకాంక్షించి రొక్కుమ్మడిన్. 30

ఆకతలన్నినంబజె మహావ్యధ; జేనికి గుండెలోపలం
దాకె నవెన్ని యోగిరులు; తాఁకెనె దృష్టి నిశాసహాసి; మ
జ్ఞాకలమైందిడెందము మహాబ్ధిఁ దరింపగదోచె; నింగి సా
ధాకృతులయ్యె భావము;లుదాత్తతమాసె నెలుంగులోపలన్.

ఆతతదుఃఖభావమున నావిభుఁడాత్మఁగలంగి "మున్ను మా
త్రాత యొనర్చినట్టి దురితంబిపుడిట్టుల వెంటనంటి యు
ద్భూతిగ దోసమై పఱగెనో" యనుచున్ మహాత్ముఁ దలంచె; సం
ప్రీతి సుఖంబుఁగోరి యొనరించిన పాపమొనర్చుఁ దాపమున్. 3౨

పూరుని గౌరవం బెటులఁబోయెనొ? హో భరతేశు పుణ్య మే
దారి నరింగెనో కద! ప్రతాపగుణాఢ్యుఁడు నన్నయైన మా
వీరయయాతి చూపిన పవిత్ర చరిత్రమదెట్టులేగెనో
చేరుఫలంబఘమ్మున కిసీ దరిఁజేరదు పున్నెమన్నఁగన్. 33

అంచితభోగభాగ్యములహర్నిశలందమొనర్ప నుర్విఁ బా
లించెడువాఁడె రాజు; కదలించినమాత్రనె సంగరాని కుం
కించెడిదే సువాజియగుఁ గించుకయైనఁ బ్రజోపభోగ మా
లించనివాఁడు వాజిని చలింపని దద్దితరాజు బూజగున్. 3౪

జగతిన్ బెద్దగఁ బోలెనుండి పదవీశక్తిన్ నిజాదృష్టమై
తగఁ బేరన్నిక కెక్కినం బిదప నిర్దాక్షిణ్యభావంబు లోఁ
దగులంజూపరు పాపమగ్నజనతార్థప్రాణమూనార్థులై
మొగమోటమ్ముఁ ద్యజింత్రనామకు లదేమో కాని లజ్జింపరే. 3౫

జనులెల్లన్ శ్రమ మందుచుండగ మహాసౌధంబుల నొచ్చగ సం
జనితానందముతోఁ బ్రజల్మోఅయిడన్ సౌహార్ద్ర భావంబున
న్వినబో; డంధశవంబురీతిఁ గన దుర్వీనాథుఁడా? యాతడీ
మనుజాళిం బలియిచ్చు ఘాతుకుడనం బాపమ్ము లేదెందులన్.

ఆ శర్యాతి మనంబులో నమితబాధాక్రాంతుఁడై వాహినీ
రాశి న్రక్షణసేయ లేకనియె; వారాశిందరింపంగ నే
డాశంజెందిన యట్టులయ్యెఁగద! లేదా, ధర్మమీమాంస; మీ
దేశక్షోభ మహాబ్ధి నీదుటకు లేదే మార్గ మీ పట్టునన్. ౩౭

తనసేనా నివహంబుతో నచటి బాధాకారణాన్వేషియై
యతఁడెల్లం బరికించి కారణములేమీ గాంచగా లేక యం
తనునాఁనాటికి వేసరించి యరిగెం దా నాత్మసైన్యంబుతోఁ
గనరానట్టిదు కారణంబులరయం గష్టంబుగా కేమగున్. ౩౮

బాలికలిలు సేరగ విభు
నాలడిగెన్ సుత నవ్వనంబునం గల శోభల్
బాల వచించెడు పల్కుల
మూలంబున ముఖ్యవిషయము ల్వినె నోలిన్. ౩౯

తల్లీ! ఏను సఖీసమేతనగు చందంబొప్ప నా కాననం
బెల్లం జూచితి నొక్కచో విపుల వల్మీకాగ్రభాగంబుపై
కెల్లం జేడెలతోడఁజేరి వివరాలెల్లం బరీక్షించు చు
ద్యల్లీల గనియుంటి మొక్కెడ సముద్యచ్ఛోభ విద్యుత్ప్రతిన్. ౪౦

దానిసాటంగు జెప్పట కుదాహరణమ్మితరమ్ము లేదు మా
తా! నికరమ్ము సు; మ్మహిమధాములు వేవురునొక్కటైన న
ద్దానికి దీటుగారనగ తథ్య; మసత్యముగాదు ;మేము మో
దాన బిలంబు లుద్దవిడి తద్దయు గ్రొచ్చితి మింధనంబులన్. ౪౧

పుడకలపోటున కంతట
మిడుగురు లవియన్ని మఱల మిణుకనకుండన్
వడిఁ బోయెఁ గానఁబడ కిఁక
నుడుగుచు మే మేగుదెంచి యుంటిమి జననీ! ౪౨

అనఁగ సుకన్యకాంబిక నిజాత్మజచే వినినంత నెంతయుం
దనపతి కేర్పడంబలికె; దాన బిరాన 'నిదాఘదాహ సం
జనిత విశాలతృష్ణునకు సారతరాంచిత తోయమట్టు'ల
జనపతి మోదమింపెసగ సైన్యముతో మునిసీమ కేగెఁ దాన్. ౪౩

ముమ్మాఱా వల్మీకము
నమ్మనుజేశుండు మిగుల నభివందనముల్
నెమ్మది భక్తి నొనర్చి య
హమ్మతి విడి దాని వారి నార్ద్రి మొనర్చెన్. ౪౪

ఈగతిన్ జలసేచనమ్మినుడు నెంతే, జేయు చత్యాదరం
బారన్ స్తోత్రముల న్నుతించు చమలస్వాంతంబుతోఁ బుట్టనే
దారిం జెక్కఁజెదర్చకే నతి భయోత్పాతంబునం దిన్నగా
ధీరత్వంబున గ్రోచ్చి కాంచెను సమాధిస్థుం దపోనిష్ఠునిన్. ౪౫

ఆ మునితేజ, మా తపసియందము, నా ఋషి శాంతభావ, మా
భూమిసురాత్మదీక్షయు విభుం డెదురంగనె; భీతి విస్మయో
ద్దామ దయాస్వభావము లెదం బరితాపమొలర్చుచుండ నా
సీఘము విస్తుబో నవసిసీ! యని తాపసి సన్నుతించుచున్. ౪౬

మునినాథా! కృపతోఁ గృతాగసములం బోకార్చు మే దీనుడ
న్ననుగావన్ సదయాకటాక్ష మొకకొంతైనం బ్రసాదింపు, మ
త్తనుజాజ్ఞాన విచేష్టితాఘ మిసుమంతై ముందు జన్మించి యా
వెనుకన్మస్తక మగ్నమయ్యె తుదకుద్వేల్ల శ్రముద్రంబుగాన్. ౪౭

బాలిక, ముద్దరాలు, పసిపాప సుకన్యక నాదు పుత్త్రి ధీ
చా లమి తానకీన సువిశాల నిరీక్షణ కాంతులెల్ల శం
పాలతలంచుసెంచు చతి పాపమొనర్చె; మహాంధుఁ జేసెఁగా
కాలగుణంబునం గలుగుగా ధర నేరికినైనఁ దప్పులున్. ౪౮

అమితక్రోధ మెలర్చి మున్మునులు శాపాస్త్రంబులన్ రాజులన్
దమరెంతో జళిపింపరా ?కృపఁ బునర్దాక్షిణ్య ముంజూపరా ?
క్షమలేదా ? యికనా పయిం దగులవా కారుణ్య భావంబులో;
దమితాంతఃపరిపంథి! మౌనికులనాథా ! దీనునబ్రోవవా ?. ౪౯

నేరక తప్పుఁ జేసిన మునీశ్వరు లిట్టులఁ దప్పుఁ బట్టరె
వ్వా; రదె పో క్షమింపు మను వారి నిటుల్నిరసింపఁ బోఁడియే?
భూరి గుణాకరా ! పరమ పుణ్యచరిత్ర ! దయామయార్ద్ర మం
దార ! యుదారభావ ! భవతాపహరా! శరణార్థిఁగావవా. ౫౦

ప్రాయశ్చిత్తమె లేదె ? దీని కిఁకనాప్రారబ్ధ మున్వీడఁబో
దా యేమీ? తెగ దంతుపొంతు కరుణోదారు ల్మునుల్గారొకో
యా మాసంబిటులేటికో 'మునివతంసా! నా ధనప్రాణ మే
నీ యర్పించెద నీకుఁ బ్రోవు'మని భూమీశుండు ప్రార్థించినన్. ౫౧

ఆతఁడె యోగముద్రన విడి యామునిఁ బల్కె నిలాతలేశ ! శ
ర్యాతి! వనంబులో నిరపరాధుల మమ్మొకసక్కెమాఁడె నీ
సూతి, వయో వికారగతిఁ జూడ్కులఁ బోకడవెట్టెఁ; గాన నా
నాతి నొసంగు పత్నియగు నా నినుఁడిట్లనె నంజలించుచున్ ౫౨.

మునివర ! నూత్నయౌవనపుఁ బోడిమిఁ; దానికితోడు ముగ్ధ సం
జనిత విలాస సంచయ విశాల మనస్కయునైన బాల న
ప్పన మొనరించు కంటెఁ బ్రియభావ మెలర్పఁగఁ దాన్స్వయంవరం
బున వరుసమ్మతింప నది పోతగు పూరుషులైన వారికిన్. ౫౩

స్వార్థముకోసమై పరులవంచనఁ గుత్తుకలుత్తరించి నా
నార్థము లొందఁజూచుట లనర్థమునా వచియింపనేల నా
ప్రార్థన మియ్యకొంటి వకృతార్థుని జేయుము; తావకీన మ
భ్యర్థన మున్వచించెద; శుభాననేనా? యుభయార్థ సిద్ధియౌ. ౫౪

ఇంతకుమించి విజ్ఞుల కిఁకేమి వచింపఁ గలాఁడ ? నో మునీ !
స్వాంతములోనఁ గిన్కనిసుమంతయుఁ బూనకు; వీతరాగియౌ
దాంతున కీయఁజాలను స్వతంత్ర వయోధిక బాలికామణిన్;
గాంతకు నెవ్వఁడీప్సితుఁడొ? కంతుఁడెవా డగుభూతలంబునన్.

అనుచు శర్యాతి మునివరు నాదరంపుఁ
బల్కులెదనెంచి సంతసపడుచు దుఃఖ
మద్భుతంబులు ముప్పిరి యగుచునుండ
మఱియు నిట్లనె తేఁకి కమ్మానివరుఁడు ౫౬

తప్పదు నాదువాక్కు భవదాత్మజ నిచ్చితివేని భక్తితోఁ,
దప్పును ముప్పు; పొమ్ము; వసుధాధిప, యార్యుల కెగ్గుచేత లి
ట్లొప్పునె? నీవు పుత్త్రిక నొసంగుటయొప్పదె? రాష్ట్రసౌఖ్యమే
తప్పకఁ గోరితేని యిదితప్పదు! తప్పునె మానివాక్కులే. ౫౭

ఆమాటలాలకించిన
భూమీశుఁడు రాష్ట్రభంగముం బొందినచో
నామనుఁగడేటికని వగ
నామునివరు వదలి చనియె నాత్మవసతికిన్. ౫౮

వచ్చెడువాని నాత్మసుత, భార్యలు నాపురి నెల్లవారలా
కచ్చుగఁ దా మెదురొకనుచు కార్యఫలంబొగి నాలకించి ని
క్కచ్చిగ నమ్మబొమ్మలటుగాగ నృపాత్మజ తండ్రికిట్లనెన్;
గ్రచ్చఱ బ్రహ్మసూత్రమెటుగల్గునో సంశయమేల నో! పితా! ౫౯

ఆమాటల్విన నెల్లవారి మనసుల్ హర్మ్యంబులందందమై
వేమారుల్ దిరుగాడి నట్టులగుచున్ విశ్వంబు నానంద మం
దే మగ్నంబయి పోయెనప్డు; భువిఁగాదే కాంతు లీడేరఁగా
సామంబెన్నగ సర్వసాధనము నా శాస్త్రంబులు న్వ్యర్థమే. ౬౦



# ద్వితీయ పథకము

దాంతుఁడౌ వాని కుద్వాహ మేరీతిగా
జరుగనున్నదొ దాని సరణి యేమొ;
అపరరుద్రుఁడు నాఁగ తప మాచరించెడి
వాని కుపయమ మేపాటి దొక్కొ;
పుట్టలోపల మౌనముద్రనుండినవాని
వైవాహికంబ దేపగిది యగునొ;
వీతరాగికిఁ బెండ్లి విధమేమి యిది యెట్లు
గానున్నదో దీనిఁ గాంచవలదె;

యన్నుచు పాతాంబు పర్ణాశులైన మునులు
సమర నైణేయ దర్భాస నారణులను
బూని పెండిలిఁ గాన నక్కాననమునఁ
జేరి రాగిఁ బెండ్లిపెద్ద లచింత్యముగను. ౧

దుర్జయుఁడైన భార్గవుఁడు దోఃపరిపాటి నెలర్చి కార్తవీ
ర్యార్జును వానివంశజులౌ రాజకులం బలయించి కీర్తిఁ దా
నార్జనఁ జేసి యున్నృపకులాంతకుడన్నఁ బ్రతిష్ఠఁగాంచె నా
దుర్జన వంశజుం డిపుడు దోర్భవజాతి కిఁకల్లుఁడెట్లగున్. ౨

ఆజన్మాంతము బ్రహ్మచర్య నియమాయాసంబుఁ బోకార్చుచు
ద్విజదర్పాపహ పరాక్రమార్జిత యశస్స్ఫీతుండుఁగా నొప్పు వి
భ్రాజద్భార్గవరాముఁ డొకప్పుఁడు నా వంశోద్భవుండీతఁడీ
యోజన్నేఁడు పరాజితుండగుట కయ్యో! యెట్టి ప్రారబ్ధమో. ౩

కాలం బెల్లపు డొక్కరీతి జరుగంగాఁబోదు జీవాళి కే
లీలన్ శంకరి యెప్పు డెట్టులుగఁ బాలింపంగ నుంకించునో
యాలీలన్ జరుగింతయేమిటికి దైవాయత్త మీలోకమం
దోలిన్ బండ్లగునోడ, లోడలగు బండ్లున్నౌ స్వరాకర్మలన్. ౪

తలకొక మతముగ నీ విధి
బలురకముల బలుకు చెల్లవారలు వేడ్కల్
దొలుకాడ నుండ నరతోఁ
దులకించెను బెండ్లివారి తూర్యస్వనముల్. ౫

'నృపతికులంబుకుం దగ దిదెంచగఁ దొల్లిటఁ బెండ్లికూతురే
తపమొనరించెనో గద? విధాత లిఖించిన దానికన్యథా
విపథముఁ జేయ శక్యమె యవేద్యముగాదట ధాతవ్రాత' యం
చపరిమితాద్భుతం బొలయనాడుచు వచ్చిరి పెండ్లికెల్లరున్. ౬

ప్రజకై ప్రాణములైన వీడుటు చితంబౌనంచు శర్యాతియు
న్నిజసేనా పరిషక్తదోష విఘటోన్నేత్ర స్థితిన్బొల్చుచున్
స్వజనంబందఱఁ గూడి తాపసజనావాసంబు కేతెంచెఁ దా
గజబృందంబులు తేరులశ్వములు లసంఖ్యానీక సంయుక్తుడై. ౭

శుభలగ్నంబునఁ బెండ్లిపెద్ద లెలమిన్ శోభావహంబౌనటుల్
విభుపుత్త్రిన్ జ్యవను న్వధూవరులుగాఁ బ్రీతిన్మహాశీస్సుల
న్శుభముంజేయ నరుంధతీ వరవశిష్ఠుల్ గాగ నొప్పారి ర
య్యుభయుల్ 'నాతిచరామి' యన్ప్రతినచే నొప్పారిరవ్వేదికన్.

మంగళసూత్ర మావిభు కుమారి గళంబలరింప మాని; సే
నాంగములోని తాపమిసుమంతయు లేక తొలంగెనంత; నె
న్నంగ మహాత్ములైన కరుణాంచితు లెందు సమర్థులౌదు రా
సంగన చేతగాని దిల యందొక కర్జముగల్గి యున్నదే. ౯

అంధుడు; నందు తాపసియు; నాత్మసుభర్త నివాస మెన్నఁగా
బంధురకాననంబు సహవాసములా మృగసంచయంబులో;
బాంధవులెన్న పాంధులిఁక భామినికయ్యెను మెట్టినింట; దు
ర్గంధ శిలాతతుల్ దలపఁగాంతకు నయ్యెడ నయ్యె శయ్యలై.

పతి యీరీతిగ నుండినన్ జనన ముద్వంశంబులోఁ జెందినన్
సతికెన్న న్గతి భర్తయే! యతడెగా సర్వంబు దైవంబు నం
చతిమోదంబునఁ గాలయాపనము సేయంజాలె నాకాంత; సం
తతమున్ లోకము మెచ్చుకోల్వడసె నా తన్వీశిరోరత్నమున్.

నందియమేల! నీజగతి సాధ్వి యదొక్కతె రక్షసేయు; నీ
చందురుఁ డర్కుఁ డృక్షములు సాగరముల్ మఱి పంచభూత, దై
నందినకృత్యముల్ జరుగనౌనె సతీమణి యల్కఁ బూన నీ
హైందవజాతియు న్మతము నంతయు నుండు సతీవశంబునన్.

సుమతిచరిత్ర మెంచ, ననసూయకతల్ దులకించి చూడగా,
నమర నరుంధతీ వరమహత్త్వమె దండలపోయ నేటి దా
కమిత విచిత్రముంగలుగనౌనె; ధరాస్థలి నెన్నగా సతీ
సుమహితమౌ చరిత్రమె సుశోభిత మన్నిటికన్న విన్నదై. ౧౩

గృహకార్యంబులయందుదాసియగుచుంగృత్యంబులంజేయుదా
బహుళాలోచనలన్మేలంగు మిగులన్బ్రశస్త్రకార్యంబులన్
విచారింపం బతిం జేరెనే నతివ భావింపంగ రంభాభ యా
సహానంబందునం బృధ్వీకీడగు సుమీ సాధ్వీమణి క్షోణిలోన్.

అరయ పతివ్రతాత్వమున కాదట సాటి వ్రతంబులే దహో!
వరగరుడోరగ ప్రముఖ వంద్యసురాసురకోటి యెల్ల సు
స్థిరతర భక్తిమై మెలంగి సేవయొనర్చు తనర్చరే! పురా
హారుండనసూయచే శిశుతనందడె; సాధ్వికి సాటిలేదిలన్. ౧౫

ఆగతి నాసుకన్యం జ్యవనర్షి గొనంగి నృపుండు వాహినిం
బ్రాగను భూతతాపమెడంబాపి సమస్త ప్రజాదృతిన్ ధరా
భాగమునేలుచుండె, బహు భాగ్యములం దనివొందుచుండె, నే
భాగమున దు ధర్మముగు పద్ధతివీడదు, లే దధర్మమున్. ౧౬

బంగారమ్మునకుం బరీమళము లభ్యంబైన చందంబుగా
శృంగారంబున కాసుకన్య తగు హాసింగూర్చె సాధ్వీత్వపుం
సాంగత్యమ్మున; నాపడంతికిలలో సామ్యమ్మె లేదంచు వ్రో
గెంగా! నాకముదాక దివ్యవనితా కీర్తిప్రహాసంబుగాన్. ౧౭

కొద్దిగ నున్నదానిఁ గడుఁగొప్పగనాడెడి యీప్రపంచ మ
మ్ముద్దియ భూరిగాథలతో పూతముగా వివరించుకొంటలో
హద్దిఁక యేమి యుండు; మఱి యంతలు నింతలుగా జెలంగు నే
ల్పద్దిగనున్నఁ జెప్పఁగొను; లోకము మాయను మాయకున్నదే.

జనపతికులములో జననమొందిన లేమ
నియమపద్ధతి నెట్లునేర్చెనొకో
రమ్యహర్మ్యంబుల రాణించు నా భామ
తాపసాశ్రమమెట్లు దలచెనొకో;
పరిచారికాతతి పరిసేవితాంగన
ప్రియమానినెట్లు సేవించెనొకో;
శుకశారికలఁ బెంప శోభిల్లు నాతన్వి
వడిలేళ్ల పెంపెట్లు వడసెనొకో;

మంగళధ్వనికలికేడి మానితాంగి
ఘోర మృగఘోషములకెట్లు గుబులు కొనదొ
ఔర; సాధ్వీమతల్లికి నలపిగాని
దుండునే? ధరలోపలందొకటి యైన.

జపమును జేయువేళకు వెసం దగఁ గూర్చుఁ గుశాసనాదు ల
త్త పసికి వీతిహోత్రసమిధాదులఁ జేర్చు సకాల పద్ధతిం
గృపగని యప్పుడాజ్ఞఁ దనకిచ్చునొ నాథుఁడదట్టిచేయుఁ దా
నపరిమితప్రియంబున సమాదృతిగాఁ దలలోనినాల్కయై. ౨౦

ఈవిధి వృద్ధుఁడౌ పతికి నింపుదలిర్పఁగ సేవజేయు చా
భూవిభు పుత్త్రి నేరము లె పుండొనరింపక శాంతమూర్తి నా
కై వడి వర్ధిలెన్; బతిసుఖంబుల శుద్ధమనస్కయయ్యె; నా
భావ మెదందలంప నను భావ్యమెగాని వచింపలేమికన్. ౨౧

'ఎప్పుడేనొక భంగిఁగాదిల నెంతవారి
కన్నవిధముగ నా జలజాక్షికడకుఁ
జ్యవనుఁడాశ్రమమందు లేనట్టి తఱిని
వచ్చిరిద్దఱుబహురూపవంతులటను. ౨౨

వచ్చినవారికిం బ్రియము వర్ధిల నింతియు నర్ఘ్యపాద్యముల్
మెచ్చఁగనిచ్చినం గొనుచు మేకొని తాఁరిటులాడి రవ్వ! నీ
విచ్చటనుండనేల? మఱి యెవ్వరవీవు; ప్రియుం డెవం;డహో!
లచ్చివొ? యప్సరోంగనవొ? లాతుల కేగతి యిట్టిరూపముల్.

అని వారాడిన మాటకుఁ
దనలోఁ బోరపొచ్చె మింతఁదపరక మివులన్.
విని తా సుకన్యయుఁగుటయుఁ
దనపతి చ్యవనుండునాఁగ తన్వి వచించెన్. ౧౮

వినియు నామెమాట విపరీతచిత్తులై
మఱల బల్కిరిట్లు తరుణితోడ
"కాంత! నీకు దగదు కాంతారవాసంబు
దివ్య సౌధవీధిఁ దిరుగు సతికి. ౧౯

కన్నియ! నిన్ను మే మెకచకంబుల నాడగ రామెఱుంగు, మీ
వెన్నగ రాజభోగముల నెంతగనో తులఁదూగఁజాలు, దీ
యన్నఁదలంపఁ దాపసియు, నాదు నివాసమరణ్యభూమి, నిం
దున్నవె కాయగడ్డ లస లున్నదియే తినఁదిండి కేనియున్. ౨౦

సురుచిరగాత్రి! మేమనెడి సూక్తులనన్ని గ్రహించుకొమ్ము; నీ
వరయఁగ భూషణావళు లపారముగా గళసీమ్ముఁదాల్చి మే
ల్బొరగుచు శీవినొప్పు; దిటువంటి మృగావళి నిట్టి మాలితో
మురిపెము లేక పందురుగ బోలునె? తామరసాక్షి! నీకిఁకన్.

కూటికిఁ బాసి, కట్టుఁ గుడ్డకు రోసి, సుఖానుభూతి కే
పాటిగ నాసఁ జేసి వనవాటికిఁ దాపసివాసిఁ జ్నాసి, తో!
పాటలగంధి! నీ కొదవు పాల్పడి బెగించిన నీ వెఱుఁగ౦ వీ
లాటి పొలంతుకల్ భువిఁ దలంపగ నుందురె? ఉండ బోదు రే.

సుదతీ! సూటిగ లట్టిమాట యొకటే సూచింతు; మాలింపు మీ
వది; లేఁ బ్రాయము నీది. యాతడననో వృద్ధత్వముం జెందె, యె
ట్లిది పోలంజనుఁ బోలినందగదు; నీ కిందీవరాక్షీ! యుతం
డిది యుంగాక మహాంధుఁడాతనికి నీ కేలాగ గుణ పొందికల్. ౯౯

అమలినగాత్రి! మా దొకరహాస్యము విన్మిక తావకీన రూ
పమునకు సాటియౌ వరుఁడెవండయినన్మతి దేవలోక మం
దమిత సురూపవంతులగు నాశ్వినులైనఁ దలంపరారటే;
కమలదళాక్షి! తెత్తుమెది కాంక్షయొనర్తువదొక్కమాత్రలోఁ. ౧౦౦

అని వ్వారలిద్దఱేగతి
వినిపింప సుకన్య యప్పుడు విసువక నిజమా!
తన భావమెల్లఁ దేర్పడ
నని యె న్నవమానుభూత్యాత్మాతె స యతిథుల కిటులన్. ౧౦౧

అక్కట హైందవాన్వయమునందొగి జన్మము నెత్తినట్టి నా
రొక్కకులాంగనన్ జెలువరోయక యిట్టిత్రపాకరమ్ములౌ
వాక్కులు వల్క నోరెటుల వచ్చెనొ భారతజాతికిన్మత
మ్మొక్కటి లేద? సర్వమును నొప్పరికింపగ దైవముండదే. ౩౨

డగ్గరి కాంతలన్వడి యెడందలవంచనఁజేసి సుంత సి
గ్గులు లేక నోటికెది యెట్టుల వచ్చునో యట్లు బల్కుచున్
గగ్గతి లేతలేత సొరకాయలఁగోసెడి దుష్టమానవుల్
గ్రమ్మగరె; సాధ్వినాగ నభిమానయుతాగ్నియె భారతావనిన్. ౩౩

తమిళలోకంబునఁ బెండ్లివేళ వరుడుఁద్ధర్మప్రజాసంపద
ర్థము గాంతిన్వరియింపఁగావలె? ననేక రమ్యార్థశాస్త్రంబులే
సుమహార్థంబుఁ దలంచెనో యది యసుశ్లోకంబు లేకున్న లో
కమునన్ మానవజాతి నీచమృగ సంఘాభేదమై పోవదే. ౩౪

పొసగం బూరుషుఁడెప్పుడున్న; నది తప్పంబట్టదీలోక మే
సీమోగాని శ్రుతిస్మృతుల్ మిగుల నుద్ఘాటించి ధర్మంబులం
కసిధారావ్రత మీ సతీత్వమనె దానన్మించె హిందూమతం
సలేదీ శివలోమతమ్మొకటి వహ్వా హైందవమ్మున్నదా! ౩౫

పరమంబైన రహస్యమొక్కటి యెదం భాషింపు డీసాధ్వి కే
తెరియుండైనను భర్త్రునాజ్ఞ నడుగేదాటంగరాదంచు నా
నరశాస్త్రగ్రంథ్మలు ఘోషఁజేసె; నది యెవ్వారైనఁ బాటించు
ధర ధర్మం; బెద ధర్మమా పతికదే ధర్మంబగున్నాతికిన్.

ఆపలుకుల్విన నంత నాయతీధులారా? మోసమాయెంగటా
యీపుణ్యాంగన నిట్లు బల్కుటిది తప్పే! కుద్ది కూర్చుండ
యాపత్తున్గాని తెచ్చుకొంటిమిదియేలా! యానోయమ్మాని
నోపం డేఁదలఁదీటఁ బోఁ గొలుః చేనూనంగ నేమయ్యెడిన్.

గుండెల్లల్లడిలంగ నాడ్వయము సంకోచించుచొండొండు
టం డీల్పాటున సంజ్ఞగా "బ్రతుకు బండాలమ్ము గాన్పించె
దుండ న్గా" దనుకొంచు నాఫె యిడగానున్నట్టి యాతిథ్యమే
గొంకొక్కించుక నొల్లకేగి రెటకో కుంభీభవచ్చిత్తులై.

ఇట్టులాధూర్తులు కాననాంతరమునందేగంగ నొక్కంత సే
పట్టి కాత్మాశ్రమ భూమికా చ్యవనుఁడబ్జాక్షీ కృతార్థ్యాదిక
త్రుటి తాత్మీయ పథశ్రమ్ముండగుచు సంతోషాత్తచిత్తంబు
తక్కటు సంప్రీతిఁ బరస్పరాక్రమ సుఖాక్రాంతస్థితిన్బల్కుచున్

కాంత! యొకింత క్రౌంచ కీటు కాననభూమిఁ ద్యజించి నిర్దయ
స్వాంతత నన్యదేశ పరివర్తన దుర్వ్యయ కాలసంగతిఁ
భ్రాంతుఁ శనైత నీమనసు నంత నదెంతగఁ బొందెనో? భయా
క్రాంత మృగాటవిం నసతిగాఁ గాను నొంటిరిభీతి జెందదే! ౪ం

నాథుని మాట కా సుమతి నాతిమతిం బతిఁ బ్రీతి సంతతా
రాధనఁజేయుచుండిన ధరం బుయిలోడుటగల్గ బోవ దో!
నాథ! సమస్తముందెలిసినట్టి మహాత్ముల కే వచింపఁ బ్రా
గ్గాథలెఱుంగు వారిఁ బలుకన్ హనుమంతుని మ్రోలగంతులా.

కలదు విశేషమొండు పలుగాథలిఁ కేల వచింతు నెమ్మదిన్
దలఁపుఁ డొకింత కు న్మను న ధర్మయుతమ్మతిథి ద్వయమ్మదీ
నిలయము జేరి యేకతమనేకముగా ననుఁబల్కిరిట్టు లో
జలజదళాక్షి! రూప విలసత్పతిఁ గోరి వరింపుమిావునాన్. ౪౨

దానికతండు సర్వము నెదంగని "కాంత! దలంక శంక నే
దేని ఫొసంగు నెప్పుడదియే యగుమే"లనుసూక్తి సత్యమై
గానబడెంగదా యిపుడు; కల్పితమాయికులై నవార లో
మానిని! యాశ్వినోత్తము లమానుషు లింద్రపురీభిషగ్వరుల్. ౪౩

వారి చరిత్ర, మింపెసగ వారికొసంగిన నీ సదుత్తరం,
బారసి యుంటి; నింకఁ దమయంతనవత్తురు నాపరోక్షమం;
దో! రమణీమణీ! విను మిదొక్కటియే యను "మన్నలార! నా
కారయ రూపవంతుఁ బతియౌనటు జేయు"డటంచు వేడ్కతో.

అనుచు సుకన్యకన్బలుకు చా చ్యవనుండు వనాంతరాశ్ర మం
దునకు చనన్ దదంతరము దోపగ నిర్వురు మారురూపముల్
గనసగు మేనిచంద మతికాంతి బయల్పడ సంభ్రమంబులో
నెనయుచు వచ్చి యిట్టులని రింతికి యేకతవేల నీక్షణన్. ౭౫

"తరుణి! సుమనమదేహ సౌందర్యగరిమ
వనము పాల్సేయ నేల, నెవ్వాడు పతి యొ
నీకు; నీలక్షణంబులు మాకుఁ జూడ
కటికి వానిని రాచిల్క గపియుటయ్యె. ౭౬

అలయింపన్బని యేమి నిన్నబల! మాయాశ్వినిదుండ్రా నఝన్
దలపందాంగ బుద్ధియౌను మతి లేదాయెంగటా స్రష్టకుం
దలయున్నం దరుణీలలామ కెచటో దౌర్భాగ్య దామోదరుం
దలకింపన్బతిగాఁగ గూర్చుటది మందాక్షంబుగాదే మదిన్." ౭౭

ఈలాగొక్కొక్కరు ప్రో
యాలెడలోఁ బల్లవించునట్లుగ బలుకన్
మేలనుకొని గికురించుచు
నాలలనయు బల్కె వారికాత్మ చరిత్రన్. ౮౫

సుదతిచరిత్ర; మంగరుచి సొంపుఁదలంపుచు 'కాంత! యింతగా
మది నలయింపనేల? ననుమానము వీడుము; మాదుమాట లం
దెది యనృతంబులేదు; యెఱిగించితివేని సురాధినాథునిన్
గదిసెద; వింతయేల, నన కాంత యొకింతగ నవ్వి యిట్లనున్.

పతియే దైవమటన్న భామినికి నెప్పాటన్ బరా భూతి యే
గతినేన్ గా దనుకొంచు నెమ్మది నిజాకాంక్షన్ని వేదించు చా
సతి బల్కెం దగ వారికిట్లులుగ నుత్సాహంబు సంధిల్ల స
మ్మతి నార్యా! బహురూపవంతునిగ నస్మన్నాథుఁజేకూర్చుడీ.

అంచితమైన ప్రీతిఁ గపటాత్మను లాశ్వినులింతిన్గాఁడి బ
ల్కించుక నాశ్రమాంగణము నింతటనంతటఁ బొంచియుండియా
లించి మహర్షి వారిపయి నెడ్డ నొకింతయుఁ గోపగింప కా
వంచకు లింక నేమనుచు బల్కెదరో యని చూచుచుండగన్.

అన్న వకోర్కి విన్న కుహనాశ్వినులిర్వురుఁ బ్రీతిజెంది యూ
కొన్న పులుంగు చూపులఁ దగుల్కొను జాలరి చల్లుముచ్చలా
గున్న తథాస్తుకామ మని కూర్మి సుకన్య వరించురూప మే
తెన్నననైన నాత్త వలదే యని వారు 'పయోష్ణి' కేగగన్. ౫౭

చ్యవనుఁడు వచ్చి యాశ్రమమునందు కళత్రము నిల్లుఁబల్కె నో
యువిద! మహాత్ములాయిరువురుత్తమ రూపములొందనెమ్మదిన్
దవిలి మహాభిషక్పటిమఁ దారిపుడేగిరి యౌవనావళిం
దవులఁ బయోష్ణికాంభమున తానమొనర్పగ నాసమస్తమున్

సర్వమిూటిఁ బలుకుచు చ్యవనుడంత
నేగె వనసీమకవ్వాడయ్యింతి మిగుల
మనసులోపల నావేదనను దలంచి
భీతహరిణేక్షణాఖ్య సంప్రీతిఁ దనరె. ౫౮

సరసీతోయములన్నిజాంగ రుచి కాంతుల్ నగాత్రనాసత్యులి
ర్వురు బోవన్ చ్యవనర్షి తత్సరిణి నేర్పొప్పంగ చేసన్న తోఁ
ద్వార నూణాత్మశరీర సంపదఖిలిపొయత్త చిత్తుండునా
చరిగెన్ దానుపయోష్ణికంతటను యూయనాచున్మహాప్రీతిగాన్.

ఆయుర్వేదవిదుల్ పయోష్ణి నవగాహస్నానముల్ జేయఁగో
ప్ఫాయత్కౌతుక సంయుతాత్ముఁడగు నాశర్యాతిజామతయుం
పేయాంభః పరిపూరితాచ్ఛ సరసిన్ వేడ్కన్ గృతస్నానుఁడై
మాయాస్ఫూర్తిఁ దనర్చె దస్రసమసమ్యాన్యాత్మ దేహద్యుతిన్.

అంధత్వమ్ముదొలంగె; వార్ధకము మాయంబయ్యె; సౌందర్యమే
సంధిల్లెన్; నవయౌవనంబమరె; నాసత్యాత్మ సారూప్య సం
బంధబయ్యెఁ బయోష్ణితోయమహిమావస్థానమయ్యెన్నిరుల్
సంధింపందలకొన్న చేకురవే హస్తమ్మడ్డుగాఁ బెట్టినన్. ౨౭

సుందోపసుందులొక సుర
సుందరికై దేహశోభఁ జొప్పడినటు లా
బృందారవైద్యులిర్వురు
సందానితులైరి తనువు సంపదలెసగన్. ౨౮

ఒకరికి ముగ్గురైరపరగి యుత్పలగంధి హృదిన్గదల్చు మేల్
రకమగు సొంపుతోడఁ దనరారి సుకన్యక క్రొమ్మెలల నిల్వనా
తికి మదిసంశయంబొదవదిట్టతనంబున నెట్టకేలకుం
ద్రికరణ శుద్ధిగాఁ బలికె దేవతలం దలపోయుచిట్టులన్. ౨౯

పతి దైవంబని యెంచితే, నొరులకెప్పుడేనిఁ గీడించుకేన్
మతిలోనైన దలంపనేఁ నతిథి సమ్మానంబులత్యాదరా
యత బుద్ధిం దగ జేసితే, నమరులారా! నాకు నానాథునిన్
ద్రుతమేర్పర్చుడనన్యెసన్ జ్యవను డు ద్యోతించె నన్నాతికిన్.

దస్రు లీరీతి యవమానితాత్ములగుచు
దస్యులట్లయి పోల్చనత్తాపసేంద్రుఁ
డనియె నాశ్వినులార! మీయందు దోసగు
లేదు; భవదుపకృతి కెనగాదొకండు.



# తృతీయ పథకము

ఉపకారంబొనరించు వారలకు లే దుర్వీక్ష ఫలాకాంక్ష, స
త్కృపయే కారణమై పొసంగు; నదిగా కేహేతువై పొల్చు? నీ
తపనుం డంబుద మిందు వృక్షవ్రజములుం దారైదు భూతంబు లీ
విపులోర్విన్ గృప నోమనేగద ఫలాపేక్షావికాంక్షుల్ సదా?

ఫలముంగోరి పరోపఁ కారమొనరింపబూనెనా? వానికిన్
దలప న్గార్యము దుర్ఘటంబు; తుదకేదైనంబొసంగించెనా?
అలతంగూర్చు; గృతజ్ఞులై కనరొరుల్; హైన్యంబుచేకూర్చులం
గలుగున్ దుర్యశమెన్నగాఁ బ్రతిఫలాకాంక్షోపకృత్యంబెటుల్

నీతిదొలంగినన్నరె కనీసము పైసలొసంగు లంచమున్
రీతిగ నెవ్వడయ్యెదియొ ప్రీతిఁ దనర్చుపకార కార్యమం
దేతఱినైన; ధర్మపుఁ బ్రతిష్ఠను గూడ నశింపఁజేయు; న
న్నీతిని వీడి లోకమవినీతికి బొల్పడె నేడదేమొకో?

రూపమొసంగి, యాంధ్యమపరూపమొనర్చి, కృపాత్మనాయువెం
తే పొడగించి జీవనముఁ దేటపడంబొనరించినార లు
ద్దీపిత సంపదాఢ్యముగ; దివ్యభిషగ్వరులార! మీఋణం
బే పగి దీరు దీరలు సమీహితబుద్ధి హవిస్సులొందకన్ ౪

కావున యజ్ఞభాగమున గౌరవనీయులరై తనర్చుఁడీరలో!
దేవభిషక్కులార! నరదేవుడు మచ్ఛ్వశురుండొనర్పగాఁ
బోవు మఖాంబులోన మరుభోక్తృలతె మీకు హవిస్సులందు సం
భావితులై ప్రసిద్ధిగ దివంబు భువంబలరింత్రుకీర్తితోన్. ౫

అనుచు జ్యవనుడాశ్వినులపై నమితప్రేమ
బల్క వారలు సంకోచపడుట మాని
దేవలోకమునకు నేగు దెంచిరంత
దనరె నానంద మ న్నూత్నదంపతులకు. ౬

ఇటులుండ స్వనకూతుభాగ్యమున కయ్యాశుండు శర్యాతి యు
త్కటమౌవేడుకనందిచూడఁ బరమోత్సాహంబులోఁ గల్గి ప్రా
కటదర్పమ్మలయన్నసైన్యుఁడగుచకా నన్నృజామాతృ ని
ష్కుటముంజేరె ధగద్ధగద్ధగిత తేజో రాజితాలంకృతిన్. ౭

ఆశ్రమవాసయోగ్యమగు నాసనమిచ్చి మహర్షి ప్రీతి న
ధ్వాశ్రమ వాసిపోవగ సపర్యలచేఁ గుశలప్రసంగమున్
బ్రశ్రయభావమేర్పడ సుభాషితముల్పచరింప శ్రేఁడహో!
విశ్రుతుడైన యల్లుని సువిక్రమముం దలపోయుచుండగన్. ౮

చ్యవనుండిట్లనె మాట మాటనెడ "నో! శర్యాతి! నీవింతటన్
సవనంబొండొనరింపు; నీకు శుభముల్ సంసిద్ధియౌమీదటన్;
భువిలోఁ బేరెనయించు; నట్టిమఖ మేఁ బొల్పారఁ జేయింతు నా
నృవరుండిష్టపడెన్; ధనాఢ్యులకు లేనేలే దసాధ్యంబిలన్. ౯

భృగువంశాగ్రణి యాజకుండయి మహాప్రీతిన్మఖారంభముం
దగురీతి న్బచరింపుచుండగ మహోత్సాహాత్మ దీక్షావిధిం
దగ శర్యాతి మహాధ్వరాగ్ఛటి హవిర్దానంబులన్వేల్పులన్
నిగమోక్తాదృతిఁ జేయుచోఁ జ్యవనుడున్నిగ్రస్థితిన్బల్కెఁ దాన్.

రాజా! యాగములందు కేవలము శక్రార్కాదులేగాదిఁకన్
బూజార్హుల్ మనకాశ్వినోత్తములు సంపూజ్యుల్గదా? దానిచే
తేజోరాజితమై మఖంబు సుఫలాప్తిం జెందునంచున్నుక
న్యాజానిశ్వశురు న్వచించి యిడె నాజ్యాదుల్ హవిర్భాగముల్.

శక్రుఁడాదిగ బృందారసంఘమెల్ల
నాశ్వినేయులకిడిన శర్యాతి యాగ
భాగముల కాత్మలో నీసుపడిరి తారు;
క్షోణిఁబరసమున్నతి కోర్వకున్నఁ జెడరె. ౧౨

తమకంటె పరులున్నతిం బడయరాదన్నన్నరే కాని లో
కములోవారలు హైన్యమొందిన తననే కాల్పట్టిసేవింపఁగా
దమకింత్రుర్వి మదాంధులైన ఘను లుద్దామార్థకాపట్యమున్
సమయింపం దలపెట్టఁబోవరతిలజ్జామాత్ర దుర్బుద్ధులై. ౧౩

శర్యాతి నృపకృతాధ్వర
మర్యాదంబొంది మిగుల మన్యువు దనరన్
కార్యంబునూని తన్మఖ
మార్యస్తుత్యంబుగాదటన్నటు దలపన్. ౧౪

చ్యవనుఁడు గోపగించి యిటులాడెను 'శక్ర! భవత్పురీభిషక్
ప్రవరుల కీతఁడిచ్చినటువంటి హవిష్యము నేడుగా భువిన్
బ్రవిదితమై చెలంగు మఖరాజిఁ దొలంగదు మాదువాక్కు; వా
సవ! మదిచింత మానుమిఁక సమ్మతిఁజూపు నృపాధ్వరంబుపైన్

అని పలుకు తపసికెదురుగ
ననలేక శతక్రతుండు హర్షము జూపన్
దనరక రోసము గడకొని
తన వజ్రాయుధమునెత్తి దార్కొనె విభునిన్. ౧౬

వాసవ! తగదిది నీకిఁక
నాసత్యులు స్వర్గభూమి నాఁకెప్పు వైద్యుల్
ధీసహితులౌట సోమము
నీ సమ్మతిఁ జూపుమనుచు నీసునఁజూచెన్. ౧౭

తాపసి చూపులోని పరతత్త్వమదేమొ వచింపలేముఁ కా
చూపున వజ్రపాణియు నిజోత్కట దోర్బలహీనుడై భుజం
బూపగలేక చిత్తరువునొందిన యాకృతిఁబోలె; మాని సం
తాపమునన్ జనించెఁ గుపితాత్ముడొకండు మదుండికంతటన్.

పుట్టి ప్రపంచమంతయును బుక్కిటఁబట్టఁదలంచినట్లు బల్
దిట్టముగాఁగ భీకరగతిన్ బ్రళయాగ్ని సమప్రకోపుడౌ
చట్టి సురేశు సైన్యమును నాతని రాజ్యము నొక్కపెట్టుగాఁ
బట్టి నిజాస్యగహ్వరము సక్రిగతిన్ వెడవిచ్చి యిట్లనెన్. ౧౮

"ఓరీ!" స్వల్పగిరి ప్రకాండ నిజపక్షోన్మూలన ప్రక్రియా
ధౌరంధర్యుడనంచు గర్వమున నుద్దామూర్ష తేజంబులో
సారంబింత యెఱుంగ; వేమిటికి వజ్రింబెత్తితీవిప్పు డ
య్యారే! చూడుమునిన్ను నీ పవిని కుయ్యాలింతు నాముష్టిచేన్.

అనుచు మదాసురుండు దనునాడిన మాటలకుల్కి శక్రుం డా
ఘనుం జ్యవనర్షి దివ్యపదకంజములంటి 'మహర్షి! నేర కే
నొనరిచినట్టి తప్పిదమునోర్మిసహింపు దయార్ద్రదృష్టితో'
నన మదరాక్షసుండు మునియాస్యముం జూచి ప్రకంపితాత్ముడై

దేవ! భవత్ప్రకోప పటుతేజభవుండ, మదాసురుండ, నా
కేవిధ నాజ్ఞ యిత్తువొనరింతును దాని; భవద్బలంబె నా
చేవయు చేష్టలంచు దరిఁజేరి సమాదృతి దండవన్నతుల్
భావసమర్పణంబిడుచుఁ బల్కెను మానిని దైత్యుఁడోరిమిన్.

అమ్మౌని కోపభావమున కప్పిశితాశి కృత ప్రలాపముల్,
వమ్మగునాత్మ దోర్బలము, వర్ధిలు హృద్వ్యథ, కిందుపడంతట
న్నెమ్మది కావరమ్ముడిగి నేర్పున నమ్ముని యంతరాత్మకున్
సమ్మతిగాగ 'దస్రులకొసంగదగున్ హవిషమ్ము' లంచనెన్.

చిత్త మిగురొత్త దస్రులమ్మత్తకాశి
ని పతిభక్తికి లోపల నపరిమితము
గ, నవసోమహావిష్యభాగాప్తి కమితే
ముదముతో దివికేగిరి పొలుపుమీర. ౨౯

కోప మిఁకేల నీకు ననుకూలముగాఁ జరియింపు; మింద్రి! లోఁ
దాపముఁ జెందనేటికి వృథా యని పీపునఁదట్టి వాని ను
ద్దీపితుఁజేయ మాని వినతిం దగు నాజ్ఞను బాకశాసనుం
డా పరమర్షి వీడ్కొని రయంబునఁబోవుచు నాత్మలోపలన్.

లెక్కయొనర్పఁ బోవక కులీన సుకన్యఁ బరీక్షసేయ నే
మక్కట యెంచనేల? మరియాద నెఱుంగకొనర్చు దానికిం
దక్కునె కీర్తి, మానము; నధర్మమొనర్చెడు వారలెక్కడో
చిక్కరె? పృథ్విలోపల నిసీ! కుటిలమ్మొడగూర్చునర్థమున్ ౩౦.

'తారుదీసిన గోతిలో జారులోక'
మనెడి మాట కుదాహృతమైతిగాదె,
యనుకొనుచు శతమన్యువు నమరపురికి
చెవులు జాఱించుకొను చేగె శీఘ్రగతిగ. ౩౧

ఇంద్రుడు దస్రు లీపగిది నేగ మదాసురుఁ డా మునీశు ని
స్తంద్రప్రభక్తి మ్రొక్కుచుఁ "పితా! మఱినాకు నొసంగుమా జ్ఞనా
సాంద్రదయాస్వభావము నొసంగ వచించె మహర్షి వాని, దే
వేంద్ర రిపూత్తమా! కుజన భీకర దుష్టజనాళినుండుమా! ౩౭

అని మునియానతింబడసి యాసురపుంగవుడంత నెచ్చ టే
డనరు సధర్మపద్ధతి, క్రుధాపరిపూర్ణమహోఘమేయెడన్,
జనసముదాయ గర్హితమసంస్తుత మెక్కుడఁదోచు నట్టి వై
న నిలయముల్ చొరంబడి తనర్చెఁదదాడి మదాభిధానుఁడై.

చ్యవనుఁడంతట శర్యాతి సవనపూతుఁ
గాగ నొనరించి కృతకృత్యుఁగాగఁజేసె
ధన్యతను నొందె రెఱువు రుద్దామ గరిమ
సజ్జనావళి సంగతి సకలశుభము. ౩౮

ఎవఁడు పవిత్రుఁడై యొసఁగి యింపుదనర్చె; సుకన్యకా సతీ
ధవుడయి సన్నుతింబడసె; దస్రుల సోమ హవిష్యదాయియై
భువిఁ బ్రథితింజెలంగి బహుపూత మొనర్చెన భారతాన్వయం;
బవితథుఁడా మహర్షి చ్యవనాభిధుఁడోము శుభప్రదంబుగాన్.

# తప్పొప్పుల పట్టిక.

| పేజి | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 8 | దై ర్యపరీత | ధైర్యపరీత |
| 6 | 3 | చచ్ఛాంభ క్రీడ | చచ్ఛక్రీడ |
| " | 15 | గన్యాకాజన; | గన్యాకాజన |
| 7 | 1 | తెల్లుఱోక్క | తెల్లరోక్క |
| " | 3 | గురువెంద | గురివింద |
| " | 8 | కిరణాలకిలలో | కిరణాలఁదూలు |
| " | 16 | సముద్ధాంతంబు | సముద్దాంతంబు |
| 8 | 8 | చరలాటు | చెరలాట |
| 14 | 5 | రాజులన్ | న్రాజులన్ |
| 15 | 12 | శెబాసనెనా | సెబాసనెనా |
| 16 | 7 | నాసంగుటయొ | నహో! ఇదుట్టో |
| 18 | 9 | వ తాంబు | వాతాంబు |
| 20 | 8 | ఖ్యానీకసంయుక్త డై | ఖ్యానీకము ల్వెంటరాఁ |
| 21 | 8 | మెచ్చుకోల్వడసె | మెచ్చుకోఁగఁగె |
| " | 13 | హేందవ | హైందవ |
| 22 | " | భాగమువదు | భాగమునందు |
| 24 | 5 | సేవజేయుం | సేవఁజేయు |
| 26 | 3 | నీవెఱుఁగంపి | నీవెఱుంగవి |
| " | 6 | వది | ఏది |
| 30 | 5 | కన్నులుకుచా | కన్నులికి యా |
| 40 | 10 | నాజ్ఞ యిత్తు | నాజ్ఞనిత్తు |